# పాఠకులకు

హైదరాబాదు ప్రభుత్వం యిటీవల ప్రకటించిన వ్యవసాయ సంస్కరణలను యథార్థరూపంలో అర్థంచేసుకోలేక పోవడమే కాకుండా ప్రజలు ప్రభుత్వ ప్రకటనల ననుసరించి కొండంత మేలు జరుగగలదని ఆశలుపెట్టుకొని యున్నారు. కాని వారి ఆశలు అడియాసలుగా పరిణమించినవి. నూతన వ్యవసాయ సంస్కరణల వాస్తవమైన లక్ష్యాన్ని ఫలితాలను తెలుపడమే ఈ విమర్శన ఉద్దేశ్యం. పాఠకులు పుస్తకాన్ని పూర్తిగా చదివినతరువాతనే ఒక అభిప్రాయానికి రావాలని మా ప్రార్థన.

పుస్తకాలను అచ్చువేయించే అనుభవం యిదివరలో లేనందున అక్కడక్కడా కొన్ని స్ఖాలిత్యాలు ఏర్పడినవి. అవకాశం లభిస్తే రెండో ముద్రణలో వాటిని సవరించటానికి ప్రయత్నం చేయగలం.

ప్రజలకు సంస్కరణలయందలి సత్యాన్ని తెలుపడానికి జరిపిన మా కృషి వ్యర్థం కాకుండా అచ్చు వేయించడానికి అడుగగానే వదాన్యహృదయులై కావలసిన మొత్తం ద్రవ్యాన్ని యిచ్చి సహాకరించిన రైతుబిడ్డ మామిత్రులు పెదగోపవరం (మధిర) శ్రీ జమలారెడ్డిగారికి మా ధన్యవాదాలు.

పుస్తకం వ్రాయడానికి నన్ను ప్రోత్సహించి అచ్చు వేయడంలో నాకు తోడ్పడిన స్టేటు కాంగ్రెసు కార్యకర్తలగు శ్రీయుత. తాళ్లూరి రామానుజస్వామిగారికి మా కృతజ్ఞతాభివందనములు.

దేశంకోసం దాస్యనిర్మూలనకోసం త్యాగంచేసి హైదరాబాదు రాష్ట్ర ప్రజాసమరంలో తమ ప్రాణాలను సహితం అర్పించిన ప్రజాసేవకులకు యిదే మా సౌహార్ద్ర కుసుమాంజలి.

ఎంతో కాలంనుండి దుర్భర దారిద్ర్యంలో మునిగివిముక్తం కావడానికి అనేక త్యాగాలు, చేసి నిరంతరం కృషిచేస్తూ సర్వతోముఖాభ్యుదయపథంలో పురోగమిస్తూవున్న శాంతి ప్రియులగు హైదరాబాదు ప్రజాసామాన్యానికే యీ రచనాంకితం.

14-12-1950
కంభంమెట్టు

ఇట్లు,
కొమరగిరి నారాయణరావు

# హైదరాబాదు జమీందారీ విధానం

హైదరాబాదు వ్యావసాయక సమస్యను చర్చించే ముందు హైదరాబాదులోనున్న ప్రస్తుత సాగుబాటు సమస్య ఏ విధంగా ఉన్నదీ తెలుసుకోవలసియున్నది. ఇప్పుడు అసలులో నున్న పద్ధతిని "రైతువారీ" విధానమని అంటారు.

అయితే ఈ విధానములోనూ రెండు అంతర్గతపద్ధతు లున్నవి. 1. దివానీ 2. సర్ఫేఖాస్. దివానీప్రాంతపు ఆదాయ మంతా ప్రభుత్వనిధికే పోతుంది. సర్ఫేఖాస్ప్రాంత ఆదాయం రాజుగారి స్వంత ఖజానాకు పోతుంది. కాని 1 ఫిబ్రవరి, 49 హైదరాబాద్ ప్రభుత్వ ప్రకటనప్రకారం ప్రస్తుతం సర్ఫేఖాస్ పద్ధతి రద్దుచేయబడింది.

రెండవ గ్రూపుకు చెందిన భూములు: ప్రభుత్వం గ్రాంటుల నిచ్చినవి; జాగీర్లు యినాములు మొదలగునవి.

జాగీరు కమీషన్ రిపోర్టు 1947 ప్రకారం జాగీర్దార్లకు జాగీరు భూమిపైన హక్కులేదు. శిస్తును మాత్రమే వారు వసూలు చేసుకొనవలెను. ఇదివరలో కొన్ని జాగీర్లకుగల సివిల్ పోలీసు అధికారాలు 1947 లోనే రద్దుచేయబడినవి.

రైత్వారీ పద్ధతిలో నూటికి అరవైవంతులు పట్టా దారుల స్వాధీనములో ఉన్నది. ఈ సంఖ్య కలసిన సర్కారుఖాస్‌తో సహా ఇది 70% అవుతుంది.

బొంబాయిలోని 1879 చట్టంప్రకారం ఇక్కడి నూల్లు జారీ ఖానూను 1317 ఫ. ప్రకారం శిస్తుల విధింపు అసలు జరుగుతున్నది. కాని తరీ విషయంలో మాత్రం బొంబాయి విధానం అసలుజరుపబడలేదు. ఈ సంఖ్య నీటివసతుల ఆయకట్టు పరిమితిని నిర్ణయించుటకు అంగీకరింపబడినది.

ఈ విధానంప్రకారం ప్రతిసేద్యఖండమునకు సర్వే నెంబర్లు ఏర్పాటు చేయబడినవి. ఈ ఖండముల యజమానులు పట్టా దారు లని ఖాతాదారు లని పిలువబడుతారు.

1317 ఫ శాసనంప్రకారం పట్టాదారు తన భూమిలో 1. వ్యవసాయం చేసుకొనుటకు 2. తన యిష్టమువచ్చిన పంట లను పెంచుటకు 3. పడావా ఉంచుకొనుటకు 4 వ్యవసాయ సంబంధమైన కొట్టాలను, ఇండ్లను కట్టుకొనుటకు 5. బావులు త్రవ్వుకొనుటకు అధికారములు కలిగియున్నాడు.

పట్టాదారు చనిపోయిన తదుపరి ఆతని శాసన వారసులు పట్టాకు హక్కుదారు లగుదురు. పట్టాదారు తన పట్టా 1. విడుదల పెట్టవచ్చును. 2. అమ్ముకొనవచ్చును. 3. యిత రుల పేర మార్చవచ్చును.

## వ్యవసాయదారుల విధములు

1. పట్టేదారు: స్వంతముగా కాని, కూలీలచేతగాని వ్యవసాయము చేయువాడు.

2. ఫోటుపట్టేదారు: ఇద్దరు లేక అంతకన్న ఎక్కువ మంది సమిష్టిగా భూస్వామ్యము కలిగియున్న నంబరుయొక్క భాగస్వామి.

3. షిక్మీదారు: పట్టేదారు తనభూమిని యితరులకు కొన్నిషరతులపై యిచ్చినప్పుడు ఆ ప్రకారమే సేద్యంచేయువాడు షిక్మీదారు అనబడును. ఒడంబడిక షరతులు పాటించినన్నిరోజులు అతనిని బేదఖలు చేయుటకు వీలు లేదు.

## 'గుత్త' సాగు విధానాలు:

సర్ మక్తా: ఒకనిర్ణీతకాలంవరకు కొంతరకం చెల్లించే షరతుపై ఒక జమీందారు తాత్కాలికంగా మాత్రమే ప్రభుత్వంవద్ద కౌలుకు తీసుకుంటారు.

తాహూద్ లేక సర్‌బస్తా: రైతువారీ పద్ధతి అమలు లోనికి రాకపూర్వం కొంతకాలంవరకు శిస్తులు మరి యితర కొన్ని ప్రభుత్వ శాఖల ఆదాయం Contractను ఇవ్వబడి ప్రభుత్వం Contract దార్ల నుండి మొత్తం వసూలు చేస్తూ వుండేది. నిర్ణీతకాలం గడిచినతరువాత ఈ Contract రద్దు కావటమో, మరల పొడిగించబడటమో జరుగుచుండెను. కాని

ఇది ప్రభుత్వానికి, ప్రజలకు నష్టదాయకంగా పరిణమించెను. కాబట్టి సర్ సాలారుజంగ్ కాలంలో ఇది రద్దు చేయబడినది.

ఇజారా : సర్ సాలార్‌జంగ్ కాలంలోనే 1263 ఫ. జనసంఖ్యను పెంపుజేయుటకును, బంజరులను సేద్యంలోనికి తీసుకొనివచ్చుటకును, కొద్ది శిస్తులపై పట్టా యిచ్చుటం (A) (5 నుండి 30 సంవత్సరాల వరకు— కొన్ని సందర్భాలలో 40 సంవత్సరాల వరకు) ప్రవేశపెట్టబడెను. 1318 ఫ లో ఈ విధానం రద్దుచేయబడింది.

పేష్కష్ : ముస్లింరాజులు దేశాన్ని ఆక్రమించుకున్న తరువాత పరాజిత ప్రభువులు సామంతరాజులనుండి కొంతనిర్ణీత కప్పమువసూలు చేసేవారు. ఈ పద్ధతి ప్రకారం నైజాంకు పేష్కష్ చెల్లిస్తున్న సామంత సంస్థానాలు గద్వాల, అనెగొంది మరియు గురుగుంట శిస్తులు వసూలుచేయు స్థానికజమీందారుల పై వెనుకటి ప్రభుత్వాలు పన్ను ముఖ్యంగాలోవలె కొంతపన్ను కాని, క్విటు రెంటుకాని వసూలు చేస్తూవుండే పద్ధతికూడా పేష్కష్ అనే వాడుకలోనికి వచ్చింది. నైజాంలో యీ పేష్కష్ చెల్లించేవారు వనపర్తి, జటప్రోలు, గోపాలపేట, పాల్వంచ సంస్థానాలు.

జాగీరు : ప్రభుత్వానికి చేయబడిన గొప్ప సేవా కార్యములకు బహుమతిగా కాని, లేక జీవనభృతికి (సగౌరవంగా హుందాతో గడుపుటకు) కాని ఉచితముగా యీయబడిన గ్రామాలు.

పాయెగా : నిజాం ఆలీఖాన్ కాలంలో సైన్యాల నిర్వహణకై అబుల్ ఖైర్ ఖాన్‌కు 4352 చ. మై. గల జాగీర్లు యివ్వబడెను. తరువాత ఈ జాగీరు మూడు వంశాలకు సంక్రమించింది. ఆ వంశాలు ఆస్మాన్ జా, 2 ఖుర్షీద్ జా 3 విఖారుల్ ఉమ్రా—ఇటీవల సైనిక నిర్వహణ బాధ్యత అంతరించి స్వయంకుటుంబాల స్వైర విహారానికై ఈ జాగీర్ల ఆదాయం ఖర్చు అగుచున్నది.

తమగా జాగీరు : ప్రభుత్వం కొంత రుసుమును ఉచితముగా మంజూరు చేస్తుంది. పరంపర వారసత్వహక్కు దీనికి వున్నది. కాని యితరులకు ఈ హక్కులను మార్చటానికి వీలు లేదు.

జాట్ జాగీర్లు : ఏ సేవా ప్రతిఫలాన్ని అపేక్షించకుండా విస్తారమైన కొన్ని భూములు జాగీరుగా కుటుంబపోషణకై యివ్వబడినవి. ఇవి జాట్ జాగీర్లు అనబడును.

తనఖాజాగీర్లు : ప్రభుత్వంలో చేయుబడు ఉద్యోగము యొక్క వేతనానికి ప్రత్యామ్నాయంగా యివ్వబడిన జాగీర్లు. ఇలాంటివి చాలావరకు రద్దుచేయబడినవి.

మస్రూతిజాగీర్లు: ఏదో ఒక ప్రత్యేక కార్య (మత పౌర లేక సైనిక) నిర్వహణకై యివ్వబడిన జాగీర్లు — ఎంతకాలం పదవీనిర్వాహణ జరుగునో అంతకాలంమాత్రమే ఈ జాగీర్లు అనుభవములో ఉండును.

మదద్ మాష్ జాగీర్లు: ప్రభుత్వముచే కుటుంబపోషణకై సహాకార నిమిత్తాలకింద యివ్వబడిన జాగీర్లు

ఈ ప్రకారం మొత్తం జాగీర్లు హైదరాబాదులో 6535 గలవు. స్టేటుయొక్క విస్తీర్ణంలో 30% భాగాన్ని ఇవి ఆక్రమించి ఉన్నవి.

## నిజాం కౌలుదారీ విధానం

హైదరాబాదులో అమలులోనున్న రైతువారీవిధానం వల్ల వాస్తవంలో ప్రభుత్వానికి సేద్యగానికి మధ్య మధ్యవర్తు లుండుటకు వీలులేదు; కాని నామమాత్రంగావున్న రైత్వారీ విధానం ఈస్థాయిని అందుకోలేక పోయింది; యథార్థానికి పట్టేదారుచే శిస్తు నిర్ణయ ఒడంబడిక చేసుకోబడింది... భూమందు హక్కు గుర్తింపబడి వారసత్వము—మార్పు—మరియు ధారాదత్తపుహక్కులు అతనికి ఈయబడినవి. రైత్వారీ విధానంలో మధ్యవర్తుల ఉత్పత్తికి అవకాశాలు సిద్ధాంతరీత్యా లేకున్నను, అనిర్ణీతమైన మార్పు హక్కును ఎంతోకాలమునుండి పట్టాదార్లు కలిగియుండుటవల్ల, క్రమక్రమంగా వ్యవసాయం స్వంతంగా చేయని జమీందార్ల వర్గ మొకటి బయలుదేరింది... వీరు తమ భూములను ఇతరులకు కౌలుకు యిచ్చి ప్రతిఫలాన్ని తీసుకుంటారు.

ఈ ప్రకారం కొనసాగిన కౌలుదారీవిధానంవల్ల కౌలుదార్ల వర్గం ఒకటి సృష్టిలోనికి వచ్చింది. వీరు పెద్దపెద్ద కౌలు

స్వత్వాలు కల్పిస్తేకాని భూమి అభివృద్ధిలో అభిరుచి అధికారం కలిగియుండరు, అవకాశాలులేక ఎప్పుడూ దారిద్ర్యంలోనే మగ్గుతుంటారు. ప్రభుత్వంవారి రిజిష్టర్లలో యీ సేద్యముచేయువారి పేర్లు నమోదు చేయబడవు. అందువల్ల భూమిపై వారికి ఏలాంటి హక్కు లభించలేదు.

19వ శతాబ్దంయొక్క చివరిదశలో జమీందారీ వర్గం— కౌలుదార్ల వర్గం పెరుగుటకు మరొక కారణంకూడ కలదు. భూమికి, జాతీయ అంతర్జాతీయ పరిస్థితులలో వచ్చిన రాజకీయ, ఆర్థిక మార్పుల ఫలితంగా మార్కెటు ఏర్పడింది. సంఘంలో భూమియెక్కువ కలిగియున్న వ్యక్తికే ప్రాబల్యం లభించేది — అందువల్ల ధనంకలిగినవర్తక వ్యాపారస్తులు— మొదలగువారంతా భూములు కొనడం మొదలు పెట్టారు. అక్రమంగా సొంత వ్యవసాయం చేయు పట్టాదార్ల సంఖ్య తగ్గి వ్యవసాయం చేయకుండానే కౌలుదారీకంపై ఆధారపడే జమీందారీవర్గపు సంఖ్య ఎక్కువౌతు వచ్చింది—జాగీర్లలో సర్ఫెఖాసు ఇలాకాలో ఈ జమీందారీ కౌల్దారీ విధానాల రూపం మరీ వికృతంగా పెరిగి కర్షకుని ఆర్థికదారిద్ర్యానికి, అసంతృప్తికి దారితీసింది. ఆ వివరాలు విదితమైనవే.

### కౌలుదార్లు చెల్లించు ప్రతిఫలంలో గల భిన్నశోషణలు

1. పంటలో సగపాలు 2. నిర్ణీతమైన కవులు రకం రూపంలో లేక ధాన్యరూపంలో చెల్లింపబడును. ఇందు జమీందారుదే పై చేయి అని చెప్పపనిలేదు.

పైన వివరించిన ఫ్యూడల్ వ్యవసాయవ్యవస్థలో భూమి కావాలనే ఆకాంక్ష ఈ నాటికి ఎక్కువై జమిందార్ల, కౌలుదార్ల మధ్య పోటీ పెరిగిపోయింది. ఇంతేకాక వడ్డీవ్యాపారస్థులు, ధనికులు దాదాపు వ్యవసాయయోగ్యమైన భూమిలో 1/3 వంతు ఆక్రమించుకొన్నారు. ఇందువల్లకూడా చిరకాలం నుండి స్వతంత్రంగా వ్యవసాయం చేసుకునే రైతులు సహితం తమ భూమిని కోల్పోయి ధనిక భూస్వాముల క్రింద కౌలుదార్లుగా వ్యవసాయం చేయుటం అనివార్యమైంది. కాబట్టి నైజాం ప్రభుత్వం కాలంలోనే ఒక కమిటీని 24 ఆగస్టు 47 న నాడు నియమించింది. ఈ కమిటీకి నాయకుడు శ్రీ బరూచా. వీరు తయారుచేసిన లెక్కల ప్రకారం 43 గ్రామముల వివరాలు:

| | |
|---|---|
| పట్టాదార్లు | 4028 |
| షిక్మీదార్లు [కౌలుదార్లు] | 1161 |
| కౌలికిచ్చుకునే భూస్వాములు | 1105 |
| కౌలుదార్లు | 1805 |

అయితే పట్టాదార్లలో ప్ర॥ శ॥ 40 ఉన్నారని తెలుస్తూన్నది. (మొత్తముపైన 36 ప్ర॥ శ॥ వీరి సంఖ్యమాత్రమే) 1937 జనాభా ప్రకారం మొత్తం 18 లక్షలు భూస్వాములు కలరు. కౌలుదార్లు కేవలం 575000 అంటే 35% సగటున్న) మొత్తంరాష్ట్రంలో ఈ అంచనా ప్రకారం 40% కౌలుదార్ల సంఖ్య కలదని స్పష్టపడుతూన్నది. ఈ లెక్కల ప్రకారమే మరత్వాడాలో 35% భూమిని భూస్వాములు కౌలుకిస్తూవుంటే తెలంగాణాలో మాత్రం 16% మాత్రమే కౌలు కిస్తూవున్నారు.

రైత్వారీవిధానంలోని ఈ లోపాలవల్ల చిరకాల పరిణామఫలితంగా ఉత్పన్నమైన సమస్యలు సంక్షిప్తంగా :— 1. స్వంతంగా వ్యవసాయం చేసుకునేవారి సంఖ్య తగ్గడం 2. కౌలుకు తీసుకొని భూస్వాముల దయాదాక్షిణ్యాలపై జీవించే కౌలుదారీవర్గం ఎక్కువకావడం 3. భూమిలేని వ్యవసాయకులు నానాటికి అభివృద్ధిపొందడం 4. భూమి స్వంత వ్యవసాయదార్లనుండి తొలగిపోయి ధనస్వాముల చేతుల్లోకి పోవడం 5. క్షేత్రసారం క్షీణించి పోవడం 6. ఉత్పత్తిపగటున అనేక పొల్లు పడిపోవడం 7. లాభసాటి పంటలు పండించే అభ్యాసం ఎక్కువై ఆహారధాన్యాల కొరత దేశంలో ఏర్పడడం—8. రైతుపై ఋణభారం అధికం కావడంవల్ల ఎక్కువ పంటలు పండించేశక్తి క్షీణించిపోయి వ్యవసాయం వృత్తిగా లేనివాని స్వాధీనంలోనికి భూములు పోవడం 9. కౌలుదారుకు "స్థిర రక్షణ" లేకపోవడం 10. వ్యవసాయం వృత్తిగా గలిగిన బీదరైతులకు కుటుంబ అవసరాలకు తగినంత ఆదాయం లభించే విస్తీర్ణంగల భూమి లేకపోవడంవల్ల అతడు వ్యవసాయాన్ని మాని యితర వృత్తులు అవలంబించడం 11. కౌలుకు తీసుకొని వ్యవసాయం చేసినా వ్యవసాయం ఖర్చులు, కౌలు శిస్తులు చెల్లించగా పోగా మిగిలేది ఏమీ లేనందున వ్యవసాయం చాలించి భూమిని వదిలిపెట్టడం 12. అత్యధికమైన కౌలు రేట్లు చెల్లించలేక భూస్వామి ప్రభుత్వ సహకారంవల్ల ఒత్తిడిచేయు సందర్భాల్లో భూమినుండి తొలగిపోవడం—13. భూములు యితరులకు కౌలుకు యిస్తే కౌలు

దార్లకు స్వాధీనపర్చుకొనే హక్కు ఎప్పుడుకను భూమిని బీళ్ళుగా మార్చడం 14. కౌలుదార్లలో నోటీసు పంపి పాతకౌలుదార్లను తొలగించి కొత్త కౌలుదార్లకు భూమినిప్పడం మొదలగు ఎన్నో వికారాలు తల యెత్తాయి. ఈ సమస్య లన్నిటికీ పరిష్కార మార్గం లేకపోలేదు. అయినా యింతకుముందు హైదరాబాదులో ఏ రకం మార్గాలు అవలంబించబడినవో క్లుప్తంగా పరిశీలింతాము.

1930లోనే హైదరాబాద్ యొక్కయు, కౌలుదార్ల యొక్కయు ప్రయోజనాలను వ్యవసాయ అభివృద్ధి తగు విధానం కొనసాగుటను అనువైన పద్ధతులను దృష్టియందుంచుకొని బొంబాయి Tenancy చట్టంయొక్క మూల సిద్ధాంతాలను అంగీకరిస్తూ ఒక చిత్తుశాసనం Tenancy Committee వారు తయారుచేశారు. హైదరాబాదు ప్రభుత్వం 1354 ఫ లో Tenancy కమిటీయొక్క సిఫారసులను అంగీకరిస్తూ హైదరాబాదు ఆసామిషిక్మీ శాసనాన్ని ప్రకటించింది. ఈ ప్రకటన ప్రకారం 18 మెహారు 1354 ఫ నుండి ఈశాసనం అమలులోనికి తీసుకొని రాబడింది. దీన్ని దృష్టిలో ఉంచుకొని స్వేచ్ఛగా అమలుపరుచుటకు కొన్ని నియమాలను ఆ తరువాత ప్రకటించి 1326 ఫ, బహమన్ నుండి ఆసామిషిక్మీ శాసనాన్ని ప్రభుత్వం ఆచరణంలోనికి తీసుకొనివచ్చింది.

## ఆసామీ షిక్మీశాసనంలోని కొన్ని ముఖ్య సూత్రాలు

1, రక్షిత కౌలుదార్లు, సాధారణ కౌలుదార్లు అని ఈ చట్టంక్రింద కౌలుదార్లు రెండు విధాలుగా విభజింపబడి

నారు. 2. 1942 వ. 1952 మధ్యకాలంలో వరుసగా ఆరు సంవత్సరాలు భూమిపై సేద్యంచేస్తూ స్వాధీనత కలిగియున్న వాడు "రక్షిత కౌలుదారు". 3. రక్షితకౌలుదార్ల హక్కులకు వారసత్వం వుండును. 4. రక్షితకౌలుదారు కాలపరిమితిని నిర్ణయించునప్పుడు ఆ గ్రామంలో అదే భూస్వామియొక్క మరొక భూఖండమును సేద్యంచేస్తూ వుండిన కాలంకూడా లెక్కించబడును. 5. ఒక భూమిపై యిద్దరు ముగ్గురు సేద్యంచేస్తూ వుండినప్పుడు—అందులోని ఏ ఒక కౌలుదారు వరుసగా ఆరు సంవత్సరాలు సేద్యంచేసి వుండినను—వారంతా ఆ భూమియొక్క "రక్షిత కౌలుదార్లుగా" ఎంచబడుదురు.

(6) పై షరతుల ప్రకారం కౌలుదార్లు తమ హక్కును ఖాయపరుచుకునే పక్షంలో అంతా రక్షిత కౌలుదార్లుగా ఎంచబడుదురు. వారు ఒడంబడిన ప్రకారం కౌలురకం యిస్తూ వున్నంతకాలం యితరులకు కౌలు కివ్వడంగాని వారే స్వంతంగా సేద్యం చేసుకునే రూపంలో జమీందారు రక్షిత కౌలుదారును భూమినుండి తొలగించడానికి వీలులేదు.

(7) తన స్వంత వ్యవసాయంకోసం ఒక సంవత్సరం నోటీసుతో పట్టేదారు "రక్షిత కౌలుదారును తొలగింపవచ్చును. రక్షిత కౌలుదారు కౌలుకాలంలో భూమికి ఏమైన శాశ్వత మరమ్మత్తులు చేసియుండిన పక్షంలో, భూమినుండి పైవిధంగ తొలగింపబడిన తను వాటి నష్టపరిహారాన్ని భూస్వామి నుండి పొందవచ్చును.

(8) ఈ శాసనం అమలులోనికి వచ్చిన తరువాత షిక్మీ దారు భూమిలో చెట్లను నాటిన పక్షంలో, ఆ చెట్లపై వచ్చు మొత్తాన్ని షిక్మీదారు అనుభవించును.

(9) రక్షిత కౌలుదార్లు—సాధారణ కౌలుదార్ల నిర్ణీత విధాన ప్రకారం జమీందారుకు కౌలురకం చెల్లించవలయును. ఏ నిర్ణయం లేనప్పుడు చుట్టుపట్ల ఉన్న పద్ధతి ప్రకారం నిర్ణయంలో ఇద్దరిలో తగాదావస్తే తహశీలులో ఎవరైనా ఫిర్యాదు చేయవచ్చును.

(10) ప్రభుత్వం రక్షిత కౌలుదార్లు యివ్వవలసిన గరిష్ట కౌలుసిస్తు పరిమితిని నిర్ణయించగలదు.

(11) కౌలురకంతప్ప యితరవిధంగా పట్టాదారు ఏమీ కౌలుదారునుండి వసూలు చేయరాదు.

(12) ప్రభుత్వం అప్పుడప్పుడు సిస్తులలోయిచ్చే మాఫీలు, బరాయిందాలు తాత్కాలిక విరామ ప్రకటనలమేరకు కౌలు రకంలో భూస్వామి మినహాయింపులు చేయవలెను.

(13) ఈ చట్టం అమలులోనికి వచ్చిన తరువాత ఇచ్చే కౌళ్ళన్నీ పది సంవత్సరాలకు తక్కువ గాకుండా వ్రాయవలెను. పైని వివరింపబడిన సూత్రాలు 1339 నుండి 1354 వరకు జరిగిన ప్రభుత్వ పరిశోధనల ఫలితంగా అమలులోనికి వచ్చినవి.

1901 నుండి 1921 వరకు లెక్కల ప్రకారం భూమి నిజమైన వ్యవసాయకులనుండి వ్యవసాయేతరుల చేతులలోనికి ఏ ప్రకారం వెళ్ళిపోయిందో క్రింద వివరిస్తున్నాము.

| | 1901 | 1911 | 1921 |
|---|---|---|---|
| భూస్వాములు | 39581 | 731803 | 761614 |
| వ్యవసాయకులు | 3473561 | 4064950 | 3607366 |
| భూ॥ ఏజంట్లు | 62986 | 34540 | 33202 |
| వ్య॥ కూలీలు | 1023643 | 2788212 | 1763562 |

## రైతాంగ శోషణ స్వరూపం

ఈమార్పు పొలంలేని, పొలాన్ని కోల్పోయిన గ్రామీణ వ్యవసాయకులలో కనబడుతూవున్న అసంతృప్తికి గ్రామం యొక్క ఆర్థిక సౌష్టవం స్వయం పోషకత్వం నాశనమై Exploiters చేతుల్లోనికి ఆర్థికనాయకత్వం పోవడానికి ప్రధాన కారణాలని పై లెక్కలవల్ల గ్రహించవచ్చును. ఈ విషయాన్ని ప్రొ॥ కేశవ అయ్యంగారు 6 జిల్లాలలో జరిపిన పరిశోధనా ఫలితాలును ఋజువు పరుస్తవి. శ్రీ అయ్యంగారు వివిధ జిల్లాలలో 56 గ్రామాలు సర్వే చేశారు. 1905 నుండి 1926 వరకు అనగా 25 సంవత్సరాలలో జరిగిన పరిణామాలను క్రింది విధంగా చూపించారు.

| జిల్లా | పట్టాదార్లు | వ్యవసాయేతరులు | వ్యవసాయకులు |
|---|---|---|---|
| మహబూబ్ నగర్ | 230 | 90 | 140 |
| నిజామాబాద్ | 314 | 34 | 280 |
| నాందేడ్ | 1076 | 250 | 826 |
| వరంగల్ | 1196 | 134 | 1062 |
| ఔరంగాబాద్ | 731 | 170 | 561 |
| రాయచూర్ | 990 | 107 | 883 |

వీరి పరిశోధనలనుబట్టి ఔరంగాబాద్ రాయచూరులలో ఆరవవంతు వ్యవసాయకులు వ్యవసాయాన్ని వదలివేయవలసి వచ్చింది. వరంగల్, నాందేడులలో పొలాలల్లో పని చేసే వాండ్లంతా జీతగాండ్లే. ఔరంగాబాద్‌లో నూటికి 30% వ్యవసాయ యోగ్యమైన భూమి వ్యవసాయేతరుల చేతుల్లోనికి పోయింది. మహబూబ్ నగరు, నిజామాబాదులో తొలగింపులు లేవు. రాయచూరులో భూమి నూటికి 15 వ వంతున, నాందేడులో నూటికి 5 వ వంతున వ్యవసాయదారుల చేతుల్లోకి మారింది. వరంగల్ 1/4 తరి భూమి వ్యవసాయ రైతుల నుండి వ్యవసాయేతరుల చేతుల్లోనికి పోయింది.

1031 జనాభా లెక్కల ప్రకారం

1. భూస్వాముల సంఖ్య = 440693
2. వ్యవసాయకులు = 1055832
3. కౌలుదార్లు = 501894

పై లెక్కల ప్రకారం కౌలుదార్లు భూస్వాముల నిష్పత్తిలో కేవలం నూటికి 32 మాత్రమే కలరు.

1941 జనాభా లెక్కల ప్రకారం

1. భూస్వాములు 917301
2. వ్యవసాయకులు 1341024
3. కౌలుదారులు 808008

అనగా 1931 నుంచి 1941 వరకు భూస్వాముల సంఖ్యలో 33% ఎక్కువైంది.

1. పట్టేదార్లు హి: షి. 1353 లో 1682596, 1354 లో 1797872, 1355 లో 1874038, 1356 లో 1903540.

2. కౌలుదార్లు : 1353 లో 423970, 1354 లో 466104, 1355 లో 495697, 1359 లో 490154.

పట్టేదార్లు—కౌలుదార్ల నిష్పత్తి 25. 19%, 25. 92% 26. 46%, 25.61%

పై లెక్కలన్నీ క్రమక్రమంగా భూమినుండి కౌలుదార్లు నిజమైన వ్యవసాయదార్లు తొలగింపబడుతూ వున్నట్లు స్పష్టంగా ఋజువుచేస్తూన్నవి.

## 1354 శాసన వైఫల్యం

1354 ఫ లో నిజాంప్రభుత్వం ప్రకటించిన శాసనం భూమిపై యాజమాన్యము అదివరకు లభించిన కౌలుదార్ల యొక్క (1) హక్కులను కాపాడుటకు (2) కౌలుయొక్క కాలపరిమితిని నిర్ణయించుటకు (3) న్యాయమైన కౌలు రేటును నిర్ణయించుటకు (4) అతివృష్టి అనావృష్టి దోషాలవల్ల సంభవించే నష్టాలపై తగిన మినహాయింపులు యిచ్చుటకు చాలా వరకు తోడ్పడగలదని ప్రభుత్వం ఆశించింది. ప్రజలు—ప్రజా సంస్థలుకూడా ఆశించినవి. Wel-Rate Committee కూడా అభిలషించింది. కాని ప్రభుత్వ యంత్రంలో గల అవినీతి, లంచగొండితనం — మరియు జమీందారీవర్గాధీన భావంవల్ల శాసనం వాస్తవరూపంలో ఆచరణలోకి రాలేకపోయింది. పైగా ఈ శాసనంలోగల ప్రయోజనాలను భూస్వాములే పొందగలిగినారు. విపరీతవైఖరి అనివార్యమయింది.

1949 లో ఈ శాసనం ఏలా అమలు జరుగుతూ వున్నదో పరిశీలించడానికని ఒక Special Committee ని నైజాంకు మారుగా వచ్చిన ప్రభుత్వం ఏర్పాటు చేసింది. ముఖ్యంగా వరంగల్ నల్లగొండ జిల్లాలలో ఈ పరిశీలన జరుపబడినది—

"It was observed that far from securing new rights the Act had an adverse effect in some cases. Long standing tenants were evicted for fear that they might claim rights under the Act".

అయితే యిందుకు ప్రధానకారణం ప్రజలకు శాసనం లోని అంశాలు సరిగ్గా తెలియక పోవడము—

తెలిసిననూ ప్రభుత్వం రైతుకు రక్షణ యీయలేక పోవడం (అట్టి నమ్మకం ప్రభుత్వంయందు రైతాంగంలో లేకపోవడంకూడ) జరిగింది. కాని స్టేటు కాంగ్రెసు దేశంలోని ఈ వాస్తవిక విషయాలను ప్రభుత్వానికి తెలిపి కొంత ఆందోళన జరిపినమీదట ప్రభుత్వం నల్లగొండ, వరంగల్ జిల్లాలలో కొంతమంది తహశీలుదార్లను అసామి షిక్మీఖానాలను అమలు పరచడానికి నియమించినది.

అసామి షిక్మీశాసనం యొక్క ఆచరణ అన్ని జిల్లాల లోను యీమాదిరే నడిచింది.

ఇన్నిన్ని దశలు గడచిన వ్యవసాయ సంస్కరణ కార్య కలాప వివరాలలో హైదరాబాద్ వ్యవసాయ సంఘం వారు తెలంగాణలో భూమి సమస్యను గురించి ప్రభుత్వానికి ఏమి సూచనలు చేశారో చూడవలసి ఉంది. వ్యావసాయిక సంఘంవారి ఉద్దేశ్యాలు ఏమైయున్ననూ అందులో నున్నవారు జమీందారులు, భూస్వాములనేది స్పష్టం. వ్యావసాయిక సం

భూమిని గురించి ప్రభుత్వమువారిచే నియమించబడిన Agrarian Committee వారు వెలిబుచ్చిన అభిప్రాయము. పేజి 144 Agrarian Report-

"We may in this connection draw attention to the views of the .... .... and of the Agriculturists Association, a representative Organisation of the land lords' interests in the State".

మొత్తంమీద శతవిధాల యత్నించి జమీందారుల ప్రయోజనాలను కాపాడే ఈ సంస్థ భూమి సమస్యనుగురించి తమ పక్షాన ప్రకటించిన "ప్రస్తుత భూసమస్యలు" అనే గ్రంథంలో వ్రాయబడిన విషయాలపై చర్చించుట అవసరంకాదు.

కౌలు సమస్యను చర్చిస్తూ 1వ పేజీలో "స్వయముగా సేద్యము చేయనివారి ప్రాబల్య విధానమువలన వ్యవసాయమునకు తీరని నష్టము కలిగినది. ఉత్పత్తిలోటు కలుగుట భూస్వాముల కౌలుదార్ల మధ్య తగాదాలు ఏర్పడుట దీని పర్యవసానములే. కౌలు షరతులలో ఎన్నిమార్పులు ప్రవేశపెట్టినను ఏ యే రూపములోనున్న కౌలువిధానమైనను వ్యవసాయ నిపుణత్వమును తగ్గించవని చెప్పుటకు వీలులేదు. అధిక కౌలురేట్లు మరియు కౌలుదార్లకు రక్షణ లేకపోవుట, అధికోత్పత్తికి ఆటంకమైననూ తమదికాదని కౌలుదార్లలో నుండుభావమే ముఖ్య ఆటంకము.

ఈ ప్రకారం జమీందారులే (1) భూమిపై యాజమాన్యం నిజమైన సేద్యగానికి లభించవలెననియు (2) అధికమైన

కౌలు రేట్లు ఉండరాదనియు (3) ఇది వ్యవసాయములో అభివృద్ధికిని — అధికోత్పత్తికి ఆటంకములై నిలిచియున్నవనియు సూచించినట్లును అర్థంచేసుకోవచ్చును. ఇంతేగాక వారు ఈ సమస్యాపరిష్కారానికై యిచ్చిన ముఖ్యమైన సూచనలు :—

"రక్షిత కౌలుదార్ల విషయంలో భూస్వాములు బజారు ధరల్ని ప్రతిశతి 25 వంతులు తీసివేయగా మిగిలిన మొత్తం వెంటనే భూస్వాములకు చెల్లించవలెను—"

దీనినిబట్టి ప్రస్తుతం భూస్వాములు బజారు ధరలో 3/4 విలువను ముట్టజెప్పినచో భూమిపై యాజమాన్యమును సంపూర్ణముగా వదలుకొనుటకు సిద్ధంగా ఉన్నారని మనం గ్రహించుటలో సంశయించవలసిన అవసరం లేదు — కాని, "బజారు" ధర అను దానికి ఒకపరిమితి యనునది లేదు. వేరువేరు ప్రదేశాల్లో స్థానిక పరిస్థితులనుబట్టి ధరలలో చాలా వ్యత్యాసము కనబడును; మరియు ఒకవేళ తాలూకా, ఫిర్కా నియోజకములలో నున్న సాధారణ ధరను "భూమి రేటుగా తీసుకున్ననూ" భూమిని దున్నే సేద్యగాండ్లకు ఆ ఖరీదులో 75% ఐనా చెల్లించే తాహత్తు కలదా ? లేదు !

ఇందువల్ల ద్రవ్యవంతులగు మధ్యవర్తులకు ఎక్కువ పొలాల నాక్రమించుటకు వీలుకలిగినది. ఇట్టి కృత్రిమపు భూస్వామ్య విధానము పూర్వకాలములో ఇచ్చటలేదు. గ్రామ సంఘాలకు, గ్రామంయొక్క సాముదాయకజీవనానికి అనుగుణ్యముగ కృషిచేసేవానికి దొరుకునట్లుగా గ్రామం భూమి పరిపడి

ఉండేది. గ్రామాదుల యీసాముదాయిక సంఘవ్యవస్థపైన చూపబడిన భూసామ్యవిధానముచే విచ్ఛిన్నముచేయబడినది. కాబట్టి భారతదేశానికి స్వాతంత్ర్యము లభించిన తర్వాత అన్ని రాష్ట్రములలోను, మనపురాతన సాంప్రదాయముల ననుసరించి భూమిదారులకు భూమిజెందేలాగున పెక్కు సంస్కరణలు చేయబడుచున్నవి. హైదరాబాదులోకూడా అనుభవజ్ఞులగు శ్రీ మాధవరావుగారి ఆధ్వర్యాన విచారింపబడిన సూచనలపై భూసంస్కరణలు అమలుకు వచ్చినవి.

# హైదరాబాదు ప్రభుత్వ వ్యవసాయ సంస్కరణల కమిటీ

## ఉద్దేశ్యాలు

ఇదివరకు హైదరాబాదు జమీందారీవిధానం ఆజమీందారీ విధానంలోనుండి పుట్టిన కౌలుదారీ విధానం — దాని చారిత్రక పరిణామాలను వివరించాము.

ఇకముందు హైదరాబాదు ప్రభుత్వం పోలీసుచర్య తరువాత ప్రకటించిన వ్యవసాయ సంస్కరణలు — అందులోని గుణదోషాలనుగురించి వివరిస్తాము. జూన్ 2, 1949 నాడు హైదరాబాదు ప్రభుత్వం ఒక "వ్యవసాయ సంస్కరణల కమిటీని" నియమించింది. కమిటీలోని సభ్యులు :—

1 ప్రధాన శిరోమణి. శ్రీ యస్. మాధవరావు

2 గులాం హైదర్ H. C. S.

3 శ్రీ డా॥ ఆర్. వి. రావు

4 శ్రీ శ్రీనివాసరావు

5 శ్రీ కే. వాసుదేవరావు

ప్రభుత్వంవారు వ్యవసాయ సంస్కరణల కమిటీని నియమించడంలోని ఉద్దేశ్యాలు.

(1) స్థానికపరిస్థితులను దృష్టిలో ఉంచుకొని అధికంగా వున్న భూమిని యితరులకు మార్పిడానికి అనువైన వ్యవసాయ ప్రాతిపదికలపై కొన్ని నిబంధనలు విధించడం.

(2) నిర్బంధ "ఏకీకరణ విధానం"లో గల అనార్థిక ప్రాతిపదికల సమస్యను పరిష్కరించడం, సహకార వ్యవసాయ క్షేత్రాలు, మరియు ఇతరవ్యవసాయ క్షేత్రాలను స్థాపించడం.

(3) ప్రస్తుత కౌలుదార్ల శాసనాలను పరిశీలించి, తగిన మార్పులను సవరణలను సూచించడం, కౌలుదార్లు జమీందార్ల మధ్యసంబంధాలను పెంపొందించడం, కౌలుదార్లకు రక్షణ కలిగించడం.

భూమి మార్పు శాసనం ఆచరణలో ఎట్టి ఫలితాలను యిచ్చిందీ పరిశీలించడం, అందులో యీనాటి పరిస్థితులకు అనువైన సవరణలను, మార్పులను సూచించడం.

ఈ వ్యవసాయ సంస్కరణల కమిటీవారు ప్రజాభిప్రాయాన్ని సేకరించడానికి 20-6-1949 తేదీన ఒక చిత్తు ప్రశ్నావళిని తయారుచేసి ప్రకటించారు. ఇందుకు (495) జవాబులు ప్రజలనుండి లభించినవి. వారు 61 సమావేశాలు జరిపి 203 మేధావుల సాక్ష్యాలను సహితం సమీకరించారు.

అయితే ఇక్కడ గమనించవలసిన విషయ మొకటి ఉన్నది, ప్రభుత్వంవారు వ్యవసాయ సంస్కరణలకమిటీని ఏవుద్దేశ్యాలతో నియమించారో — ఆ ఉద్దేశ్యాల్లోనే ప్రధానమైన లోపాలున్నవి.

అధికంగావున్న భూమిని యితరులకు మార్చడంలో భూమిలేని వ్యవసాయకూలీలకు భూమి లభింపజేసే ఉద్దేశ్యం యిమిడిలేదు. జమీందార్లు, కౌలుదార్ల మధ్యసంబంధాలను పెంపొందించడం అంటే, సంబంధాలను పూర్వంకన్న బాగు పరచడం—లభించిన అవకాశాలను మంచిగా ఉపయోగించుకోవడం బాగుపఱచడం అంటే సరిదిద్దుట—సర్దుబాటౌతుంది. ఈ బాగుపఱచడం క్రమశః ఒక విధమైన ఒడంబడికకు దారి తీస్తుంది. ఈ సమాధానంలో జమీందారు కౌలుదారుపై కాని, కౌలుదారుజమీందారుపై కాని ఒత్తిడితీసుకోరావచ్చును. అయినా "అవకాశాలు" ఎవరికి లభిస్తే వారే మరొకరిపై సమాధాన పడేటట్లు ఒత్తిడి తీసుకోరావడానికి అవకాశాలు లభింపజేయడమే యీ ఒడంబడిక ఫలితం. లభించిన అవకాశాలను ఉపయోగించుకోవడంలోనూ, ఎవరికి అవకాశం లభిస్తే వారే ఎక్కువగా ఆ యవకాశాలను మంచిగా ఉపయోగించుకో గలుగుతారు. చిరంతనకాలంనుండి పరిస్థితులను బట్టి ఉన్న చట్టాలనుబట్టి సంఘంలో జమీందారులకే స్వప్రయోజనాలను సాధించడానికి, అక్రమంగా కౌలుదార్లను పీడించడానికీ "అవకాశాలు" ఎక్కువగా లభిస్తూ వచ్చినవి, ఈ కమిటీఉద్దేశ్యాల ప్రకారం శాసనరీత్యా "ఎవరికి వీలైతే" వారు "శాసనాన్ని" తమ కనుకూలంగా "ఉపయోగించుకోవడానికి" అవకాశాలు

లభింపజేస్తే ప్రస్తుత సైనిక పరిపాలన పరిపాలనాయంత్రంలో గల అవినీతి లంచగొండితనాన్ని ఉపయోగించుకొని కౌలు దార్లపై అమానుషమైన వత్తిడి తీసుకరావడానికీ, తమ కనుకూలంగా సమాధాన పడేటట్లు వారిని నిర్బంధించడానికీ జమీందార్లకు అవకాశం యివ్వడం ఔతుంది.

సంస్కరణల కమిటీ ఉద్దేశ్యాలు "Terms of referance" భూమికలో యింకా యీ విధంగా స్పష్టంగా వ్రాయబడినవి.

(1) వ్యవసాయోత్పత్తిని ఎక్కువ జేయడం.

(2) రైతుల్లో శాంతి సంతృప్తిని కలిగించడం—భూమిపై స్వాధీన భద్రతను కలిగించడం,

పై సూత్రములను గమనిస్తే వ్యవసాయోత్పత్తియే ప్రధానలక్ష్యంగా పెట్టుకొని పూర్వపు శాసనాల్లో సవరణలుగాని, మార్పులుగాని, చేయబడవలెననే అంతర్యం భోధపడుతుంది. దీనిని బట్టి "ఎవరుభూమినుండి ఉత్పత్తిని" ఎక్కువగా తీయగలిగితే వారికే "భూమి" లభించవలెనని ప్రభుత్వోద్దేశ్యమని మనం అర్థం చేసుకోవాలి. సిద్ధాంతరీత్యా యిది సమంజసంగానే కనబడుతూవున్నది. కాని ఈ నాటి పరిస్థితుల్లో ఎవరికి ఎక్కువ ఉత్పత్తి తీయడానికి ఎక్కువ వ్యవసాయం నైపుణ్యంతో చేయడానికి అవకాశా లున్నవో మనం

తెలుసుకున్నప్పుడు ఈ సూత్రం ఇంకా స్పష్టంగా మనకు అర్థమౌతుంది. అవకాశాలు అంటే Oportunities :—

(1) శాస్త్రీయ పరికరాలు.

(2) మంచి పశువులు.

(3) ఎరువులు, విత్తనాలు

(4) రిమిషన్లు, సబ్సిడీలు.

(5) నీటిపారుదల సౌకర్యాలు.

(6) రవాణా సౌకర్యాలు

లభించడంలో పూర్వము, ఈనాడూ మనకున్న అనుభవాన్నిబట్టి ఈ అవకాశాలన్నీ జమీందారులకు, పెద్ద భూస్వాములకే ఎక్కువగాఉన్నవి. పేదరైతులకు, కౌలుదార్లకు చాలాతక్కువగా ఉన్నవి. భూమి యాజమాన్యం కూడా, ఈనాటికీ, ఉన్న చట్టాల ప్రకారం జమీందారులకు, పెద్ద భూస్వాములకే ఇవ్వబడి యున్నది

(1) ఉదాహరణానికి, హైదరాబాదు ప్రభుత్వం 1949 బడ్జెట్టులో "నీటిపారుదల, చెఱువుల మరమ్మతు విత్తనాలు, ఎరువులపంపకం, ప్రాజెక్టుల నిర్మాణం క్రింద సుమారు7 740 లక్షల రూపాయలు ప్రత్యేకించింది. అందులో విత్తనాలు, ఎరువులపంపకం, వ్యవసాయ పరికరాల పంపకం, బావుల నిర్మాణంక్రింద ప్రతిశతి 75 జమీందారులకే లభించింది.